రాష్ట్రపతి

# సుభాషచంద్రుడు

"అగ్నిహోత్రుడు"



జ్యోతి గ్రంథాలు
మద్రాస్

# రాష్ట్రపతి సుభాషచంద్రుడు

భారతజాతి చేయగల ఆ మహత్తర గౌరవము—ముఖమండలముమీద బంగాలీ ఉపజ్ఞ యవ్వనోద్వేగము శోభ తాండవమాడుతూవున్న ఒకమహావ్యక్తికి యీయేడాది దక్కినది—అంటూ శ్రీమతి సరోజనీదేవి—కాంగ్రెస్ కార్య సంఘసమావేశంలో ప్రకటించింది. ఇదియథార్థం.

ఈసంవత్సరం భారతజాతి సుభాష చంద్రబోసుకు కాంగ్రెసుపట్టం కట్టింది.

సుభాష చంద్రబోసు 1897–జనవరి 23–వ తారీఖున కటకములో జన్మించాడు. బోసు తాతముత్తాతల కాపురస్థలము ఇరువదినాలుగు పరగణాలజిల్లాలో కోడాలియా గ్రామం. తండ్రి జానకీనాథబోసుగారు, మంచి పలుకుబడిగల సభ్యతామూర్తి. ఆయన కటకములో గవర్నమెంటు ప్లీడరుగా చాలా కాలం వున్నారు. కటకము పురపాలకసంఘానికి, జిల్లాబోర్డుకు ఆయన సమర్థతగల అధ్యక్షులుగా వున్నారు.

జానకీబోసుగారికి యెనమండువురు కుమారులు, ఆరువురు కుమార్తెలు. వీరిలో ప్రస్తుతం 7 గురు కుమారులు, యిద్దరు కుమార్తెలు సజీవులైవున్నారు.

తండ్రి తన సంతానానికి మంచి విద్యావకాశాలు కల్పించాడు. ఉన్నతవిద్యలకుగాను, కుమారులనుఅందరినీ జానకీనాథబోసుగారు యూరపు పంపించారు. బోసుగారు చేసిన సేవకుగాను గవర్నమెంటు ఆయనకు రాయ బహదూర్ బిరుదము ప్రసాదించింది. కాని గత శాసనోల్లంఘనోద్యమపు రోజులలో ప్రభుత్వము అనుసరిస్తూవుండిన నిర్బంధవిధానముపట్ల అసమ్మతి చూపడానికి ఆబిరుదాన్ని నిరాకరించారు. జానకీనాథబోసుగారు 75 యేండ్ల అనంతరం జీవయాత్ర చాలించారు.

సుభాషచంద్రుని తల్లి ప్రభావతీదేవి. యీనాడు 69 యేండ్లవృద్ధ. తన కుమారుడు హరిపురములో కాంగ్రెస్ గద్దెయెక్కి భారతజాతిచేస్తున్న గౌరవాన్ని పొందుతూవుంటే జలజల ఆనందబాష్పాలు రాల్చింది. వీరమాత, ఆదర్శ హిందూ స్త్రీ, భారతస్త్రీత్వము ఆమె స్వరూపము దాల్చినది అనవచ్చు. దయాదాక్షిణ్యములకు ఆమెను పేర్కొని మరి యితరులను చెప్పాలి. దానధర్మములు పూజాపునస్కారములు అంటే ఆమెకు అపరిమితానందం. ఆమె ఆదర్శ జీవన విధానములోని ఉత్కృష్టత యొక్క ఛాయలే ఆమె సంతానములోకూడా ప్రత్యక్షం. తల్లిగుణములే పిల్లలకు కూడా అలవడ్డాయి. ఆ యిల్లాలిసంతానం ఆమెను పూజిస్తూవుంటుందంటే అందులో అతిశయోక్తిలేదు.



జానకినాథబోస్

(సుభాషచంద్రుని తండ్రి)

౦౦౦

సుభాషచంద్రుణ్ణి 5-వ

చేట కటకంలో ప్రొటస్టెంట్ యూరపియన్ పాఠశాలలో చేర్చారు. 12-వ యేడు వచ్చేవరకూ అక్కడే చదివాడు. ఆతరువాత అక్కడ నుంచి రెవెన్షా కళాశాలకు చేరిన ఉన్నత విద్యాలయానికి మార్చారు. 1913 లో మెట్రిక్యులేషన్ పరీక్షలో యూనివర్సిటీకంతటికీ 2-వ వానిగా కృతార్థుడయ్యాడు. విద్య సముపార్జించినకాలములో సుభాషచంద్రుడు యెన్నడూ అగ్రస్థానమేఅలంకరిస్తూవుండేవాడు.

1914 లో బోసు దృష్టి శ్రీరామకృష్ణపరమహంస, వివేకానందస్వాముల సిద్ధాంతముల వైపు మరలింది. పాఠశాలలో విద్య పూర్తి అయ్యేసరికే అతడు కొంత స్నేహబృందాన్ని తయారు చేసికొన్నాడు.

మెట్రిక్యులేషన్‌లో కృతార్థుడు అయినతరువాత సుభాషచంద్రుడు కలకత్తావెళ్లి ప్రెసిడెన్సీకళాశాలలో జేరాడు. ఇంటర్మీడియట్ చదువుతూ వున్నప్పుడు స్వార్థరహితమైన నిరాడంబరజీవనము వాంఛిం



ప్రభావతీబోస్
(సుభాషచంద్రుని తల్లి)

చాడు. ఎవ్వరైనా ఒకగురువువద్ద ఉపదేశంపొంది సన్యాసి కావలెననుకొని —అతడు యెవరితోనూ చెప్పకుండా యిల్లువిడచి హరిద్వారము, కాశీ, బృందావనము మొదలైన పుణ్యక్షేత్రాలకు వెళ్లాడు. అనేకమంది సాధువులను కలిసికొన్నాడు. కాని విలాసమయమైన వారి కపటజీవనము సుభాష చంద్రునికి నచ్చలేదు. విసిగి నిరాశతో యిల్లుచేరి టైఫాయిడ్ జ్వరగ్రస్థుడై మంచము పట్టాడు.

జ్వరము నిమ్మళించింది. ఆతరువాత ఇంటర్మీడియట్ చదువులు సాగించడానికి ఆరంభించాడు. 1915 లో ఇంటర్మీడియట్ పరీక్షలో కృతార్థుడు అయాడు.

ప్రెసిడెన్సీ కళాశాలలోవుండగా సుభాషచంద్రునికి డాక్టర్ సురేశ బెనర్జీతో యెక్కువ పరిచయం యేర్పడింది. బెనర్జి ఆల్ ఇండియా ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ అధ్యక్షుడు.

०००

సుభాషచంద్రుడు ప్రెసిడెన్సీ కళాశాలలో చదువుతూవుండగా ప్రొఫెసర్ ఇ. యఫ్. ఓటెన్‌ను (కొంతకాలానికి ఈతడు బెంగాలుకు డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్ అయ్యాడు) కళాశాలలో నే చితుకతన్నాడనే నేరారోపణపై కళాశాలనుంచి అధికారులు బహిష్కరించారు. ఈబహిష్కారానికి పరిమితి అంటూ లేదు.

కళాశాలాబహిష్కారమే సుభాషచంద్రుని జీవితములో మార్పును తీసుకొనివచ్చింది. పర్యవసానం యెలావుండినా, లెక్కచేయకుండా— పాలకవర్గానికి చెందినవారి అహంభావాన్ని యెదిరించక తప్పదని నిశ్చయించుకున్నాడు. మధ్యపరగణాలు, బీహారురాష్ట్రముల విద్యార్థిమహాసభలలో తన కళాశాలాజీవితంగురించి బోసు యిలాచెప్పాడు:

"సక్రమవర్తన అనే కొలప్రమాణంతో చూస్తే నా కళాశాలా జీవితంలో లోపాలు లేవని చెప్పడానికి వీలులేదు. కళాశాలనుంచి బహిష్కరించినరోజున, ప్రిన్సిపాల్ నన్ను పిలిపించి చెప్పినమాటలు, యీనాటికికూడ నాచెవులలో గింగురుమంటున్నవి–"మొత్తంమొత్తం కళాశాలలో నీఅంతటి పేచీకోరు మరొకడు లేడు." ఆరోజు నాజీవితములో ఒక ముఖ్యమైన దినము. నా జీవనవిధానం మారడానికి ఆరోజే కారణం. ఒక అభిప్రాయం కోసం కష్టాలు సహించడంలోవుండే మహత్తరానందాన్ని అప్పుడే చవి జూచాను. ఉన్నతాశయంకోసం బాధానుభవముపొందటం, అందువల్ల పొందగలిగేఆనందం ఇంతయింతయని చెప్పడానికి అలవికాదు. ఆ ఆనందం ముందు మరింకొకటి యేదీ నిలువదు. నాలో అంతవరకు భావములోనే ఉండినసీతి, దేశభక్తి తొలిమారు కార్యరూపంలో ప్రదర్శించి దాని మంచి చెడ్డలను పరీక్షించడానికి అదనుఅయింది. నా భావిజీవనవిధానం అప్పుడే స్థిరీకరణకు వచ్చింది."

౦౦

సర్ అసతోష్ముఖర్జీసహాయంతో 1917లో కలకత్తా విశ్వవిద్యాలయంలో చదవడానికి సుభాషచంద్రుడు అవకాశం చిక్కించుకున్నాడు. స్కాటిష్‌చర్చి కళాశాలలో బి. ఏ. డిగ్రీ పొందాడు. అదేసమయంలో బంగాళంలో ప్రప్రథమాన్ని ప్రారంభింపబడిన, యూనివర్సిటీ ట్రెయినింగ్ కోరులో చేరి, మిలిటరీ తరిబీదు పొందాడు. 1919 లో కలకత్తా విశ్వవిద్యాలయంలో యమ్. ఏ. డిగ్రీకి చదువుతూ ఇండియన్ సివిల్ సర్వీస్ పరీక్షలో కృతార్థుడు కాడానికి ఇంగ్లండువెళ్లాడు. వెళ్లిన 8–వ నెలనే ఐ. సి. యస్. పరీక్షకు కూర్చున్నాడు. పరీక్షలో నెగ్గలే ననుకున్నాడు కాని, మొత్తం పరీక్షకువచ్చినవారిలో 4 వ వానిగా బోస్ ప్యాసయ్యాడు. అతరువాత కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయపు బి. ఏ. డిగ్రీకూడా పొందాడు.

ఉర్రూతలూగించే ఐ. సి. యస్. ఉద్యోగము కళ్లయెదుట తాండవమాడుతూవుంది. కాని రాజకీయంగా బానిసత్వాన్ని అనుభవిస్తున్న మాతృదేవిపిలుపు బోసుకు వినబడుతూవుంది. 1920 లో జరిగిన అఖిలభారత దేశీయమహాజనసభ కాన్పూర్ సమావేశంలో సహాయనిరాకరణోద్యమాన్ని అమలులో వుంచడానికి తీర్మానంజరిగింది. గాంధీమహాత్ముని నాయకత్వం క్రింద మొత్తం దేశం అంతా ఒక్కమారుగా ఆపోరాటంలోకి దుమికింది. అప్పటికి బోస్ ఇంగ్లండులో వున్నాడు. మాతృసందేశాన్ని ఆలకించి ఇండియన్ సివిల్ సర్వీస్‌కు రాజీనామాయిచ్చి 1927 లో స్వదేశానికి తిరిగి వచ్చాడు. వచ్చీరావడంతోనే గాంధీమహాత్ముని సందర్శించాడు. గాంధీమహాత్ముడు, దేశబంధు చిత్తరంజనదాస్‌ను కలసికొమ్మన్నాడు. సుభాషచంద్రుడు, దేశబంధుదాసును కలిసికొని సహాయ నిరాకరణోద్యమంలో తీవ్రంగా పాటుబడ్డాడు.

ఇదేసమయానికి ఇంపీరియల్ సర్వీస్‌లో ప్రముఖోద్యోగంలోవున్న డాక్టర్ ప్రఫుల్ల చంద్రఘోష్ తనపదవికి రాజీనామా యిచ్చాడు. దేశమాత పిలుపువిని మహోన్నతపదవులకు రాజీనామాయిచ్చిన, ఈయిద్దర్నీ గాంధీమహాత్ముడు శ్లాఘించాడు. ఇంతటి మహత్తరత్యాగంచేసిన యువకుల నాయకత్వం క్రింద బంగాళంలో సహాయనిరాకరణోద్యమము అగ్నిశిఖలాగు నాలుగుమూలలకు వ్యాపించింది.

o°o

సుభాషచంద్రబోసు–1921 లో దేశబంధు చిత్తరంజనునిచే ప్రారంభింపబడిన గౌడీయ విద్యాయతన్ జాతీయకళాశాలకు ప్రధానాచార్యుడయ్యాడు. పైగా అప్పటి బంగాళా రాష్ట్రీయ కాంగ్రెస్‌కమిటీకి ప్రముఖ ప్రచారకోద్యోగి. ఈహోదాలో అనేకప్రత్యుత్తరాలు, నివేదికలు, బోస్ ప్రకటించాడు. బంగాళంలోని కాంగ్రెస్ ఉద్యమాన్ని యెవరువిమర్శించినా

ఆవిమర్శనకు సహేతుకమైన సమాధానములను, బోసు యిస్తూవచ్చాడు. బోసు సమాధానాలు ప్రజలకు సంతృప్తికరంగా ఉండేవి. విమర్శకులకు మరి మాట్లాడడానికి అవకాశంవుండేదికాదు. ఆసందర్భంలో 'స్టేట్స్మన్' పత్రిక ఇలా వ్రాసింది:

"సహాయనిరాకరణోద్యమ సందర్భంలో సుభాషచంద్రబోస్ గారు, ఇండియన్ సివిల్ సర్వీస్ హోదాకు రాజీనామా యిచ్చారు. ఈ రాజీనామా వల్ల కాంగ్రెస్ పాలకవర్గానికి అసమానశక్తులుగల మంచిఉద్యోగి లభ్య మయ్యాడు. బ్రిటిష్ ప్రభుత్వం చతురత, చురుకుదనంగల ఒకఉద్యోగిని కోల్పోయింది. సందేశాలు, సమాధానాలు, విమర్శనలు, ప్రతివిమర్శనలు చేయడంలో బోస్ గారు సిమ్లాప్రభుత్వాన్ని యెందుకూ పొందకుండా చేసేసారు."

ఆతరువాత స్వరాజ్యసేవక సంఘా (జాతీయవాలంటీర్లు) నికి సుభాష చంద్రుడు సేనాధిపతి అయ్యాడు. ఇదివరలో యూనివర్సిటీ ట్రెయినింగ్ కోరులో పొందిన శిక్షణ బోసుకు ఉపకరించింది.

౦౦౦

ఇంతలోనే దేశంలో నిర్బంధవిధానం ప్రారంభమైంది. 1921 నవంబరు 17-వ తేదీన వేల్సుయువరాజు ఇండియాకు వచ్చాడు. ఆనాడు భారతీయులు, హర్తాళం సాగించారు. సుభాషచంద్రుడు ఆసందర్భంలో బంగాళంలోని యువకులలో తినసుగల పలుకుబడిని పూర్తిగా ప్రదర్శించాడు.

నవంబర్ 17-వ తేదీని కలకత్తా నిర్మానుష్యనగరం. ఒక కలకత్తాయే కాదు-బంగాళమంతా అదేవిధంగా వుంది. ఇండియాలోని ప్రతిపట్నం లోనూ హర్తాళం సాగింది. యేవిధమైన అలజడి, అల్లరి లేకుండా అంతా సవ్యంగా వుంది. కాని ఇండియాలోని యూరపియనులు బ్రిటిష్ రాజ్యానికి ఊడిగాలు కొట్టే కొందరు, యీ హరతాళం బ్రిటిష్ రాజ్యానికి, వేల్స్ యువ

రాజుకు అవమానం అనడం మొదలుపెట్టారు. పనిచేయ నిరాకరించడం క్షంతవ్యంకాని మహాపరాధమన్నారు. ప్రజల భక్తివిశ్వాసాలను ధ్వంసం చేయడమే ఈ నైతిక ప్రోద్బలముయొక్క ఉద్దేశమన్నారు. ఇండియాలోని ఆంగ్లోఇండియనులు, యూరపియనులు అంతాచేరి యీ అవమానము భరింపరానిదన్నారు. ఈరెండు సంఘాలవారి ఆగ్రహము కాంగ్రెస్‌మీద విరుచుకుపడింది. ఇంతకూ హర్తాళ్ ముసాగించినవి ప్రజాసమూహాలు. ప్రజలు వారికి తోచిందేదో వారుచేసారు. శాంతిభద్రతలకుమాత్రం భంగంరాకుండా కాంగ్రెస్‌వాలంటీర్లు కొంచెం హుషారుగా వున్నారు. ఇండియాలోని ఆంగ్లో ఇండియనుపత్రికలు పెద్దపెద్ద తలకాయలంతటి అక్షరాలతో కాలములతరబడి కాలములుగా విషము కక్కడము మొదలుబెట్టాయి. జనరల్ డయ్యర్ అనంతరం ఆమధ్య యెప్పుడూ భారతీయులు చవిచూచియుండని వర్ణవిద్వేష భావాలు ఈహరతాళ్ సందర్భంలో ప్రదర్శితమయ్యాయి. ప్రభుత్వంకూడా దీన్ని అందుకుంది. కలకత్తా గవర్నమెంటు భవనంలో యోచనలమీద యోచనలు, మంతనములమీద మంతనములు సాగాయి. ఒక ఉన్నతప్రభుత్వోద్యోగి 'యిది యోచనలకు సమాధానములకు సమయంకాదు, ఉద్యోగులకు సంపూర్ణాధికారాలు యిచ్చివేయాలి, అందుకు తుండుకుపాకీకూడా అవసరమ'ని తీవ్రంగా వాదించాడు. వెంటనే ఫిరంగులు మోపుపెట్టిన మోటారులు కలకత్తావీధులలో తిరుగ నారంభించినవి. క్రిమినల్‌లా అమెండ్‌మెంట్ చట్టం అనుసరించి, బంగాళంలోని కాంగ్రెసు, ఖిలాఫతు వాలంటీర్లదళములు, అక్రమసంఘాలంటూ బంగాళాప్రభుత్వం ప్రకటించింది.

ప్రభుత్వం అంతటితోనే ఆగలేదు. నవంబర్ 18–వ తేదీ అర్ధరాత్రి పోలీసులు ఖిలాఫత్, కాంగ్రెసు కార్యాలయములను చుట్టివేసి శోధించారు. ఆ మరునాడు మొత్తము 12 కార్యాలయములను శోధించారు. ఆశోధనలు మహాఘోరంగా వున్నవి. ఆ వివరములను జాతీయపత్రికలు ప్రకటించాయి.

అప్పుడు రివాల్వర్లు కాని పుస్తకములు, ఉత్తరములు, ఆఫీసులెక్కలు వగయిరాలు అన్నింటినీ పోలీసులు తీసికొనివెళ్లారు. ఊరులో మూడుమాసములపాటు ఊరేగింపులు, ఉత్సవములు, బహిరంగసభలు యేవీ జరుగరాదు అంటూ కలకత్తా కమీషనరు ప్రకటించాడు

०°०

కాంగ్రెస్, ఖిలాఫత్ వాలంటీరు ఉద్యమములు అక్రమసంఘములుగా బంగాళాప్రభుత్వం ప్రకటించినదానికి ప్రతిగా కలకత్తాలో ఒక నివేదిక వెలువడింది. ఈనివేదికలో వేలకొలదిగా కలకత్తా జాతీయవాదులు సంతకములు చేశారు. బంగాళాప్రభుత్వము పెట్టినఆటంకమును ప్రతిఘటించడమే ఉద్దేశముగా పెట్టుకొని కాంగ్రెసువాలంటీరుదళమును ప్రారంభించడమన్నదే యీ నివేదికలోని ప్రధానాంశం.

నివేదికపైన సంతకము చేసినవారిలో దేశబంధు చిత్తరంజనదాసు, మౌలానా అబుల్ కలామ్ అజద్, సుభాషచంద్రబోసు, మొదలైన అనేక ప్రముఖనాయకులు ఉన్నారు. ఈనాయకులను అందరినీ 1921 డిశెంబరు 10 వ తేదీన ఎరెస్టుచేశారు. దానితో బంగాళములో ఒకవిధమైన ఆవేశం బయలుదేరింది. జాతీయవాదులు గుంపులుగుంపులుగా బందికానాకు ప్రయాణం కడుతూవచ్చారు. ఆవిధంగా జైళ్లన్నీ నింపివేశారు.

దేశబంధు చిత్తరంజనదాసుతో బాటు బోసుకూడా ఆరుమాసములు జైలువాసం గడపాడు. బందికానాలో వున్నప్పుడే దేశబంధు యొక్క మహత్తర శక్తిసామర్థ్యాలను, పట్టుదలను బోసు తెలిసికొనగలిగాడు. బందికానాలో సుభాషచంద్రుడు దేశబంధుకు వంటచేసిపెట్టేవాడు. కార్యదర్శిగా పనిచేసేవాడు. అంతేగాక కొన్నికొన్ని సందర్భములలో నైతిక వేదాంతం బోధించే అధ్యాపకుడుగాకూడా వ్యవహరించేవాడు.

సుభాషచంద్రుడు శిక్ష పూర్తిగా అనుభవించాడు. 1922 లో బంది ఖానానుంచి బయటకువచ్చాడు. వచ్చిన కొద్దిరోజులకే అక్టోబరులో ఉత్తరబంగాళంలోని ప్రజలు వరదలవల్ల నష్టపోయి యిండ్లులేక తిండిలేక మలమల మాడిపోతూవున్నారని తెలిసికొని వారికి సహాయం చేయడానికి ఉత్తరబంగాళానికి వెళ్లాడు. బంగాళా క్షామనివారణ సంఘ కార్యదర్శిగా బోసు పనిచేశాడు. ఆసందర్భంలో తనకుగల అఖండశక్తిని ప్రదర్శించాడు. బోసుచేసిన మహత్తరసేవకు ప్రజాసమూహములేగాక అప్పటి బంగాళా గవర్నరు లార్డులిట్టన్ స్వయంగావచ్చి శాంతహారులో అభినందించాడు.

1922 డిశెంబరులో గయాకాంగ్రెసు. సుభాషచంద్రుడు దేశబంధుతో కాంగ్రెసుకు వెళ్లాడు. కాంగ్రెసు సమావేశములో స్వరాజ్య పక్షంయొక్క శాసనసభాప్రవేశ కార్యక్రమాన్ని బోసు బలపరచాడు. కాంగ్రెసునుంచి వచ్చీరావడముతోనే 1923 ఎన్నికలసందర్భమున జరిగేప్రచారములో నిమగ్నుడయాడు. స్వరాజ్యపార్టీ నిర్మాణ విషయములో బోసు చాలా శ్రద్ధపుచ్చుకున్నాడు. ఆదేసమయంలో "బాంగ్లార్ కథ" దినపత్రికను ప్రారంభించాడు. ఆతరువాత దేశబంధు, "ఫార్వర్డు" పత్రికా నిర్వహణాన్ని సుభాషచంద్రునికి వొప్పగించాడు. 'ఫార్వర్డు' పత్రిక మేనేజరుగా పనిచేసి సుభాషచంద్రుడు పత్రికానిర్వహణములో తనకుగల సామర్థ్యమును ప్రదర్శించాడు.

కాని ఆసమయములో శాసనసభాప్రవేశము అంటే కాంగ్రెసునాయకులు చాలమందికి యిష్టంలేదు. దేశబంధు బ్రహ్మాండమైన ప్రచారము లేవనెత్తవలసివచ్చింది. చివరకు 1923 లో ఢిల్లీలోజరిగిన ప్రత్యేకసమావేశములో శాసనసభాప్రవేశ తీర్మానము ఆమోదింపబడినది.

౧౦

దేశబంధు దాసు నాయకత్వముక్రింద బంగాళా స్వరాజ్యపార్టీ 1924 లో కలకత్తా కార్పొరేషనును స్వాధీనం చేసికున్నది. దేశబంధు చిత్తరంజనదాసు ప్రప్రథమములో కలకత్తా మేయరుగా నియుక్తుడయాడు.

సుభాషచంద్రుడు 1924 ఏప్రెల్ 24 వ తేదీన క్రొత్తచట్టము ప్రకారం కార్పొరేషన్ ప్రధాన కార్యనిర్వాహకోద్యోగిగా నియమితుడు అయాడు. బోసు ఆ ఉన్నతోద్యోగానికి నియమితుడు అయాడు కాని బంగాళా ప్రభుత్వానుమతిమాత్రం అవసరం. ఈవిషయమై రాష్ట్రీయ ప్రభుత్వం ఒక్కమాసందినములు యోచనచేసింది. చిట్టచివరకు ప్రభుత్వం అనుమతించింది. ఆపదవికి మాసానికి మూడువేలరూపాయల జీతం. కాని సుభాషచంద్రుడు రు. 1500 ల కన్న యెక్కువ తనకు అవసరం లేదు అన్నాడు. కాని ఆపదవిలో అయన యెంతోకాలం ఉండడానికి అవకాశం లేకపోయింది. ఉద్యోగంలోనికివచ్చి ఆరుమాసములైనా పూర్తిగా నిండలేదు, యింతలోనే ఎరెస్టు వచ్చింది.

o°o

గవర్నరు జనరల్ 1924 అక్టోబరు 25 వ తారీఖున ఒక క్రొత్త ఆర్డినెన్సుచట్టాన్ని అమలులోనికి తీసుకవచ్చాడు. అది బెంగాల్ క్రిమినల్ లా అమెండుమెంటు చట్టం. ఇది 1818 రెగ్యులేషన్ III కు సోదరుడు అనవచ్చు.

ఈచట్టము వెలువడడముతోనే బంగాళం బంగాళం అంతా వొక్కమారుగా గగ్గోలుపుట్టింది. ఎక్కడచూచినా ఎరెస్టులే. ఎక్కడచూచినా గృహశోధనలే. ఉండిఉండి హటాత్తుగా యిండ్లచుట్టు పోలీస్ 'గాటు': పోలీసులు డజనులకొలదిగా యిళ్లల్లోప్రవేశించి గంటలతరబడి యిళ్లను కలయవెతకివేస్తూ వుండేవారు. వీధులలో పోలీసుపటాలములు యెప్పుడూ తిరుగుతూవుండేవి. జాతీయోద్యమములో నాయకత్వము వహిస్తూవుండే పలుకుబడిగలవారిని యెందరినో ఎరెస్టుచేస్తూవుండేవారు. దేశముకోసము మహత్తరత్యాగముచేసినవారు యెంతోమంది బందీలు అయారు. తెల్లవారజాము రెండుగంటలవేళకు ప్రారంభమయిన గృహశోధనలు ఆరోజుఅంతా

సాగుతూవేవున్నవి. మొత్తము ఆనాడు 60 యిండ్లు శోధనచేశారు. ముఖ్యంగా బంగాళారాష్ట్రీయ కాంగ్రెస్ కార్యాలయభవనము, బంగాళా స్వరాజ్యపార్టీ భవనములు, సత్యాగ్రహకార్యాలయము, ప్రముఖస్వరాజ్యవాదుల యిండ్లు—వీటిని గాలించిపారవేశారు. కలకత్తా కార్పొరేషన్ ప్రధాన కార్యనిర్వాహకోద్యోగి, దేశబంధు చిత్తరంజనదాసు కుడిభుజము సుభాషచంద్రబోసు, సత్యేంద్రచంద్రమిత్ర (ప్రస్తుతము బంగాళా శాసన సభాధ్యక్షుడు), అనిలవర్ణ రాయ్, బంగాళా శాసన సభ స్వరాజ్యపక్ష సభ్యులు, స్వరాజ్య పార్టీ కార్యదర్శులు — వీరందరిని ఒకేఒకరోజున కలకత్తాలో ఎరెస్టు చేశారు. రివాల్వర్లు బాంబులు, వాటిని తయారు చేయడానికి అవసరమైన పరికరములు — యిటువంటివి వున్నవనే అనుమానము మీద వారంట్లు జారీచేసినట్లు తేలినది. ఇన్ని గృహాలు శోధించినా యే యింటి



కేంబ్రిడ్జి విద్యార్థి సుభాషచంద్రుడు.

లోనూ యెక్కడాకూడా రివాల్వర్లుగాని, బాంబులుకాని బాంబులుచేయ డానికి అవసరమైన సామగ్రికాని దొరకలేదు. ఎరెస్టుచేసినవారికీ, జరిగిన యే దురంతాలికీ ముడిబెట్టడానికి యెటువంటి అవకాశమూ లేకపోయింది. కాని దొరికిన ఉత్తరప్రత్యుత్తరములు, ఫైలుకాగితాలు చివరకు సుభాషచంద్రుని యింటిలోవున్న కార్పొరేషన్ కాగితాలుకూడా పోలీసులు పట్టుకు పోయారు.

०°०

కలకత్తాలో ఎరెస్టులుజరిగిన అదేరోజున బంగాళములో అనేక ప్రదేశాలలో అనేకమంది జాతీయ సేవకులను—ముఖ్యంగా స్వరాజ్యపార్టీ సభ్యులను పోలీసులు యెరెస్టుచేశారు. హవురా, నౌవాఖలి, బారిసాల్, ఢాకా, పాబ్నా, కొమిల్లా, తారకేశ్వర్, హుగ్లీ, నారాయణగంజ్, చాంద్‌పూర్, ఫత్‌పూర్, చిట్టగాంగ్ మొదలైన అనేకప్రదేశాలలో యెంతోమందిని ఎరెస్టుచేశారు. ఇండ్లను గాలించివేశారు. ఈశోధనలు జరిగిన యేయింటిలోకూడా ఒక్క రివాల్వరుగాని, ఒక్కబాంబుగాని, అటువంటివస్తువు మరేదీగాని కనబడనేలేదు. ఆర్డినెన్సు, రెగ్యులేషన్ III ఆధారంతో బంగాళంలోని స్వరాజ్యపార్టీనాయకులలో చాలామందిని యెక్కడెక్కడకో తీసికొనిపోయి నిర్బంధంలో వుంచివేశారు. క్రొత్త ఆర్డినెన్సు ప్రారంభించిన మొదటివారంలోనే 75 మందిని తీసికొనివెళ్లారు; యింకొకమాసమురోజులలో మరి 35 మందిని ఎరెస్టు చేశారు.

०°०

సుభాషచంద్రబోసును మొట్టమొదట ఆలిపూర్ బందికానాలో వుంచారు. ఆతరువాత మూర్షిదాబాదుజిల్లా బరహాంపూర్ బందికానాకు మార్చారు. బరహాంపూర్ జైలులో కొన్నిమాసములు ఉంచినతరువాత మరి యెటువంటి జైలుమార్పులూలేకుండా బర్మాలోని మాండలే బందికానాకు పంపివేశారు.

సుభాషచంద్రబోసును నిర్బంధించారనేసరికి బంగాళములో పెద్ద అలజడి బయలు దేరింది. ఎటువంటి విచారణగాని, కారణముకాని లేకుండా సుభాషచంద్రబోసును అరెస్టుచేసి నిర్బంధంలో ఉంచడముగురించి ఆసమయమున కలకత్తా మేయరుగావున్న దేశబంధు యిలాఅన్నాడు:

"దేశాన్ని ప్రేమించడమే ఒక అపరాధమయితే, నేనూ అపరాధినే. సుభాషచంద్రబోసు అపరాధిఅయితే—నేనూ ఒక అపరాధినే—కార్పొరేషన్ ప్రధాన కార్యనిర్వాహకోద్యోగియే కాదు, యీ కార్పొరేషన్ మేయరునైన నేనుకూడా అతనితో సమానముగా అపరాధినే."

సుభాషచంద్రబోసు నిర్బంధం కార్పొరేషను వ్యవహారములకు యెన్నోవిధాల చిక్కులకు కారణం అయింది. అందువల్ల కార్పొరేషన్ ప్రధానోద్యోగి సుభాషచంద్రునిపైనగల విశ్వాసాన్ని ప్రకటించవలసింది అంటూ దేశబంధు ప్రకటించాడు. సుభాషచంద్రునిమీద ప్రజలకుగల విశ్వాసం వెంటనే యెన్నికలలో ప్రకటితం అయింది. బంగాళాశాసనసభకు ఉత్తరకలకత్తానియోజకవర్గపు యెన్నికలసందర్భాన్ని బోసుపైనగలవిశ్వాసం ప్రకటితమయింది. సుభాషచంద్రుడు బందికానాలో యినుపకమ్మీల వెనుక ఉన్నాడు. ప్రజలు అతనినే తమప్రతినిధిగా యెన్నుకొన్నారు.

ం౦ం

మాండలే బందికానాలోని యేకాంతవాసము, ఆప్రాంతములోని తీవ్రమైనవేడిమి సుభాషచంద్రుని ఆరోగ్యాన్ని పూర్తిగా ధ్వంసం చేసింది. ఆబందికానాలోవుండగా బోసు 40పౌనులు తగ్గిపోయాడు. దానికి తోడు క్షయచిహ్నములు కనబడ్డాయి.

దినములు గడచినకొలది బోసు ఆరోగ్యము మరింత చెడిపోతూ వచ్చింది. 1927 ఏప్రెల్ మాసము నాటికి బోసు మంచముపట్టాడు. కలకత్తా ప్రసిద్ధవైద్యుడు, సుభాషచంద్రుని సోదరుడు డాక్టర్ సునీల్‌చంద్రబోసు

మరికొందరు ప్రభుత్వవైద్యులు అతని దేహస్థితిని పరీక్షచేసి సుభాష చంద్రుని ఆరోగ్యము ఆందోళన కలుగజేస్తూవుందని చెప్పారు. కలకత్తాలో గాని మరి ఇండియాలో యే యితర రేవుపట్టణంలోగాని ఆగకుండా ఆరో గ్యానికని యకాయకి యూరపునకు వెళ్ళడమమంచిదని ప్రభుత్వముతరఫున మోబర్లేగారు సలహాయిచ్చారు. సుభాషచంద్రుడు యిందుకు సమ్మతించ లేదు. ఈవిషయమై సుభాషచంద్రుడు శరతుచంద్రబోసుగారికి పెద్ద ఉత్తరంవ్రాశాడు. ఇన్సీన్ బందికానానుంచి 1927 ఏప్రెల్ 4-వ తేదీన సుభాషచంద్రుడు యిలావ్రాశాడు:

"గడచిన రెండుయేండ్లలోను ప్రభుత్వం నన్నుపెట్టిన అవస్థలసంగతి పూర్తిగా మరచిపోయినట్లుగావుంది. ఆబాధలు అన్నింటినీ అనుభవించినది నేను కాని ప్రభుత్వముకాదు. ఎటువంటిన్యాయమూలేకుండా ఇంతకాలమూ నన్ను అన్యాయంగా నిర్బంధంలో ఉంచినది ప్రభుత్వం. నన్ను నిర్బంధంలో ఉంచినప్పటినుంచి యీనాటివరకు—నామీద ఆధారపడివున్న వారెవ్వరికి యేవిధమైన పోషకభృతిగాని యిచ్చివుండలేదు. నాపై యేదో చిట్టచివరి మార్గంగా నేను వైస్రాయికి విన్నపముపంపుకొంటే బంగాళాప్రభుత్వం దానినికూడా పంపకుండా త్రొక్కివేసింది. ఇదిఅంతా యిలావున్నప్పుడు పైగా నన్ను మూడేళ్లపాటు యూరపులో ప్రవాసనిర్బంధంలో వుండ మంటున్నది. అందుకుతోడు ఆయూరపుప్రవాసానికి కావలసినడబ్బు నన్నే చూచుకోమంటున్నది. ఇది ధర్మసమ్మతమైనయేర్పాటేనా? 1924 లో నేను యెటువంటి ఆరోగ్యంలో వున్నానో అటువంటి ఆరోగ్యస్థితిలోనే నన్ను తిరిగి విడువవలెనన్న నైతిక దృక్పథముకూడా ప్రభుత్వానికి లేకపోవడము కేవలము అధర్మము."

ఇలావ్రాస్తూ యూరపుప్రవాసానికి అయ్యేఖర్చులను ప్రభుత్వం భరిం చాలనీ, యూరపుప్రయాణానికి ముందుగా తనబంధువర్గాన్ని చూడడానికి

అనుమతియియ్యాలనీ, ఆమూడుయేండ్ల ప్రవాసానంతరము ఇండియాకు తిరిగి రాడానికి యెటువంటి నిర్బంధాలు వుండరాదనీ యిటువంటియేర్పాటులు షరతులు వాంఛించడములో అధికముకోరడము యేమీలేదనీ తెలియజేశాడు.

ఆతరువాత బోసు బర్మానుంచి శరతుబోసుగారికి వ్రాసిన మరొక ఉత్తరంలో యిలా వ్రాశాడు:

"బందికానాలో మనము యిలా అవస్థలు పడుతూవుండడము భారతజాతి యిదివరకుచేసిన తప్పులపరిహారార్థము తపస్సుచేయడముగా భావిస్తూవున్నాను. మనభావములు అభిప్రాయములు యిందువల్ల చావవు. మనభావములు ఒకతరమువారినుంచి మరి యింకొక తరమువారికి వ్యాప్తినందుతవి. ఈఅభిప్రాయంవొక్కటే నాకీ అవస్థలను యెదుర్కొన డానికితగిన శక్తి యిస్తుంది."

మాండలే బందికానాలో సుభాషచంద్రునితో మరికొంతమంది రాజకీయనిర్బంధితులువున్నారు. వీరు దుర్గపూజ, సరస్వతిపూజచేయడానికి అవకాశములు అవసరమని యెన్నోమారులు జైలుఅధికారులను కోరారు. కాని అధికారులు అంగీకరించలేదు. అందువల్ల సుభాషచంద్రుడు, మిగిలిన రాజకీయనిర్బంధితులు అంతా నిరశనవ్రతం ప్రారంభించారు. మాండలే బందికానాలో రాజకీయనిర్బంధితులను యింత అవస్థలుపెట్టడము అధర్మము అమానుషము అంటూ కలకత్తా కార్పొరేషను తీర్మానరూపముగా వ్యతిరేకాభిప్రాయాన్ని ప్రకటించింది. రంగూన్ ప్రజలు సమావేశమై నిరశనవ్రతముసాగిస్తున్న వారిపట్ల సానుభూతి ప్రకటించారు. కలకత్తాప్రజలు కూడా నిరసనతీర్మానము చేశారు. ఇదేసందర్భంలో ఫిబ్రవరి 28-వ తేదీన కలకత్తాలో సంపూర్ణమైన హరతాళము జరిగింది.

చివరకు మాండలే జైలులోని సుభాషచంద్రుడు, మిగిలిన రాజకీయనిర్బంధితులు నిరశనవ్రతాన్ని విరమించారు.

1927 మే 15 వ తేదీన అనారోగ్యం కారణంగా సుభాష చంద్రుణ్ణి వదలివేశారు. బోసు బందికానాలో వున్నంతకాలమూ కలకత్తా కార్పొరేషన్ అతనికికావలసినసెలవు యిస్తూవచ్చింది. ఈవిధముగా బందికానాజీవితము ప్రారంభమైనదిమొదలు 1927 మే 12 వ తేదీవరకు కలకత్తా కార్పొరేషన్ ఆతనికి శెలవు యిచ్చింది.

౦౦౦

సుభాషచంద్రుని విడుదల అదివొక తమాషా. ఒకమాయ. అసలు విషయం యేమిటో చాలా కాలంవరకూ యెవ్వరికీ తెలియదు. అందులో ఒకవిధమైన తమాషా నాటకం వుంది. చికిత్స కోసమని అతనిని అల్మోరాకు మార్చవలసినదని ఆర్డర్లు. యథార్థంలో బోసును కలకత్తా తీసుకువచ్చి విడిచిపెట్టారు.



మాండలే బందికానానుంచి బయటపడిన సుభాషచంద్రుడు

కలకత్తా చేరినతరువాత అనారోగ్యస్థితిలోవున్న సుభాషచంద్రుడు 'ఇప్పుడు నాయిల్లు నేను చేరుకున్నాను. నేను

మొట్టమొదట చేయవలసినదిసాఆరోగ్యముచక్కబరచుకోనడమే. ఆతరువాత యిదివరకు అనుసరిస్తూవుండిన సేవాకార్యక్రమాన్ని మళ్ళీ సాధ్యమై నంతత్వరలో అనుసరించాలి. ఇదే సానిశ్చయము" అంటూ ప్రజలకు ఒక సందేశము యిచ్చాడు.

కాని యింకా ఆరోగ్యము చక్కబడకముందే సుభాషచంద్రుడు దేశసేవాకార్యములలో పాల్గొనడము ప్రారంభించాడు. పాట్నాలో ఉపన్యసిస్తూ "మనం జబ్బుపడడానికి వీలులేదు. మనదేశంలోవున్న ప్రస్తుతస్థితిలో జబ్బులో మూల్గుతూ వొకచోట కూర్చోడానికి యెంత మాత్రమూ వీలులేదు" అంటూ చెప్పాడు. కరువుకాటకము ప్రజలను మాడ్చి, చేస్తూవున్న ఆప్రాంతాలకు వెళ్లాడు. శాసనసభలో స్వాతంత్ర్యముకోసం యెలాపోరాడడమో ప్రత్యక్షంగా ప్రదర్శించాడు. స్వాతంత్ర్యప్రచారం చేస్తూ విపరీతంగా సంచారంచేశాడు.

౧౦

ఇంతలోనే సైమన్‌కమీషన్ సందర్భంలో దేశమంతా తీవ్రాందోళనబయలుదేరింది. సైమన్‌కమీషన్‌తో మనకు యెటువంటి జోక్యములేదని దేశములోని అన్నిరాజకీయపక్షములవారూ ప్రకటించారు. సైమన్ విచారణసంఘాన్ని పూర్తిగా బహిష్కరించాలని అఖిలభారత దేశీయమహాసభ తీర్మానించింది. ఆసమయమున సుభాషచంద్రునికి రెండుచేతులా పని. ఒక ప్రక్క స్వదేశపు ఉద్యమము, మరొకప్రక్క సైమన్ బహిష్కరణప్రచారము. యీరెంటినీ అతిసమర్థతతో చాకచక్యముగా సాగించాడు బోసు.

1928 ఫిబ్రవరి 3_వ తేదీన సైమన్ విచారణసంఘం బొంబాయిలో వోడ దిగింది. "సైమన్‌గారూ తిరిగివెళ్లండి" అనే ఊరేగింపులు దేశమంతటా సాగినవి. విద్యార్థులు, కార్మికులు సమ్మెసాగించారు. హరతాళము విజయవంతముగా సాగింది. సుభాషచంద్రుడు కలకత్తా విద్యార్థుల నాయకత్వం వహించాడు.

సుభాషచంద్రుడే బంగాళములో వాలంటీరుఉద్యమాన్ని పునరుద్ధరించాడు. 1928 డిశెంబరులో కలకత్తాలోజరిగిన అఖిలభారత దేశీయ మహాజనసభసందర్భంలో బోసు తనలోవున్న మిలిటరీ తత్వాన్ని దేశానికి ప్రదర్శించాడు. బ్రహ్మాండమైన వాలంటీరుదళాలను తయారుచేశాడు. ఆదళములకు ఆధునికసైనికశిక్షణను యిచ్చాడు. సుశిక్షితమైన దళముల మహానాయకుడై సుభాషచంద్రుడు కలకత్తావీథులలో కాంగ్రెసుఅధ్యక్షుడు మోతీలాలు నెహ్రూగారికి స్వాగతముయిస్తూవుంటే ఆశోభ చూడవలెనే గాని వ్రాయడానికి వీలులేదు. ఆ ఊరేగింపు ఆ జాతీయపతాక వందనోత్సవముచూచిన ప్రజలు యీనాటికికూడా విపరీతముగా చెప్పుకొంటూ వుంటారు.

కలకత్తా కాంగ్రెస్ (1925)లో గాంధీమహాత్ముడు సమాధానపూర్వకమైన తీర్మానాన్ని ప్రవేశపెట్టాడు. మద్రాసు సమావేశములో ఆమోదించిన సంపూర్ణస్వాతంత్ర్య తీర్మానముయొక్క 'వడి' తగ్గిపోయేటట్లుగా మహాత్ముడు అధినివేశ స్వపరిపాలనాతీర్మానాన్ని తీసుకొని వచ్చాడు. ఈతీర్మానమునకు వ్యతిరేకంగా సుభాషచంద్రుడు తీవ్రంగా పోరాడాడు. ఆసందర్భంలో బోసు యిలా ఉపన్యసించాడు: "నెహ్రూనివేదిక సూచించిన అధినివేశస్వపరిపాలనమును బ్రిటిషుగవర్నమెంటు 1929 డిశెంబరు 31–వ తారీఖులోపున ఇండియాకు ప్రసాదిస్తే, కాంగ్రెస్ దానికి సిద్ధమౌతుంది. దానితో కాంగ్రెస్ శాశ్వతముగా అధినివేశ స్వపరిపాలనమునకు అంటుకొని దానితో తృప్తిపడి వూరుకుంటుందన్నమాట! అధినివేశ స్వాతంత్ర్యానికి తృప్తిపడడము అంటే దీనికి మేము యెంతమాత్రమూ అంగీకరించి ఊరుకోలేము. ఇవ్వాళ అధినివేశప్రతిపత్తి యిచ్చినా దానిని జాతీయాశయపూరణముగా మేము అంగీకరించలేము. స్వాతంత్ర్యం అనేది యెప్పుడో వచ్చేస్థితియనికాకుండా యిప్పుడే యీక్షణముననే సిద్ధించవలసిన రాజకీయాశయముగా మేము భావిస్తాము.

ఆదేసమయాన్ని సుభాషచంద్రుడు మహాత్మునితీర్మానానికి ఒకసవరణ తీసుకొనివచ్చాడు: "మద్రాసు కాంగ్రెస్‌సమావేశములో ఆమోదించిన సంపూర్ణస్వాతంత్ర్యము 1928 లో జరిగే యీ కలకత్తాసమావేశములో మేము మరల ఆమోదిస్తూవున్నాము. ఆ లక్ష్యము అలానే వుంటుంది. అంతేగాక బ్రిటిషుప్రభుత్వ సంబంధములేకుండా చేసికొంటేనేగాని నిజమైన స్వాతంత్ర్యము లభ్యముకాదు అని యీసభవారు నమ్ముతూవున్నారు."

పైసవరణను ప్రతిపాదిస్తూ సుభాషచంద్రుడు యిలా వుపన్యసించాడు: "సంపూర్ణస్వాతంత్ర్య తీర్మానంవల్ల మనకు వచ్చేదేమిట అని మీరు అనవచ్చు. మనలో ఒక కొత్తధోరణి—కొత్తతత్వము ప్రారంభం ఔతుంది. ఇంతకూ మన రాజకీయపతనానికి ముఖ్య కారణం యేమిటి? అదే మనతత్వమునకు సంబంధించిన విషయము. మనం యీ తత్వాన్ని బానిసతత్వాన్ని పోగొట్టుకొనవలెనంటే మనప్రజలను సంపూర్ణస్వాతంత్ర్యంకోసం పోరాడమని ప్రోత్సహింపక తప్పదు. నేను యింకొకవిషయంకూడా చెపుతున్నాను—మనం యీతీర్మానపుఅంశాన్ని కార్యరూపంలోకి తీసికొని రావడానికి ప్రయత్నించమే అనుకొందాము; అయినాకూడా ప్రజలకు ఒక ఉన్నతాదర్శం చూపినవాళ్లం ఔతాము. ఉన్నతాశయాలు ఉత్కృష్టాదర్శాలు కలిగివుండడములో యేమి తప్పువుంది? ఆ స్వాతంత్ర్యంగురించి ప్రచారం చేయడము మనప్రజల కనులయెదుట ఒక ఆకర్షవంతమైన చిత్రాన్ని సృష్టించినవాళ్లం ఔతాము. ఆద్వారా ఒక క్రొత్తఆవేశముగల భారత జాతిని సృష్టింపగలుగుతాము. కాని యింకముందు మనము చేతులు ముడుచుకొని కూర్చోమని నేను హామీ యిస్తున్నాను. భారతయువజనబృందము యిప్పటికప్పుడే విధ్యుక్తధర్మాన్ని గ్రహించి దానిపని చేయడానికి సంసిద్ధమాతూవుంది. మనం వొక మంచి జీవంవున్న కార్యక్రమాన్ని నిర్ణయిద్దాం. ఆనిర్ణయించిన దాన్ని చెత్తగా పారవేయవలసిన అవసరం



హరిపురంలో సుభాషచంద్రుడు పతాకోత్సవం జరిపాడు.

యేర్పడదు..........బంగాళానికి సంబంధించినంతవరకు జాతీయోద్యమము ప్రారంభమైననాటినుంచీ నేటివరకూ స్వాతంత్ర్యం అంటే సంపూర్ణ స్వాతంత్ర్యమే అని నిర్వచించివుంది. స్వాతంత్ర్యం అంటే అధినివేశ స్వపరిపాలనమంటూ మేము యెన్నడూ అర్థము చెప్పుకోలేదు. అధినివేశ స్వపరిపాలనము అంటే మన యువజనులకు యేమాత్రమూ సహించదు. యువజనులే భావిభారత భాగ్యోదయకారకు లనినమాట జ్ఞాపకం వుంచుకోండి."

సుభాషచంద్రుని సవరణపై వోటుచేశారు. సవరణకు అనుకూలంగా 973 వోట్లు, వ్యతిరేకంగా 1350 వోట్లు వచ్చాయి. బోసు సవరణ వోడిపోయింది.

o°o

కలకత్తా 1926 డిశెంబరు 30-వ తేదిన జరిగిన హిందుస్థాన్ సేవాదళ సమావేశానికి సుభాషచంద్రుడు అధ్యక్షత వహించాడు. ఆ సందర్భంలో వాలంటీరుదళముల అవసరముగురించి బోసు అధ్యక్షస్థానంనుంచి ఉపన్యసించాడు:

"వాలంటీరుఉద్యమం దేశానికి యెంత ఉపయోగమో—యెంత అవసరమో యిప్పుడు మనం గ్రహిస్తున్నాము. ఈ యథార్థాన్ని యితరదేశాలు యిదివరకు యెంతో కాలంక్రిందనే గ్రహించాయి. మన దేశంవంటి పరాధీనదేశాలు యేవన్నా మహోత్కృష్టాశయాలను పూర్తిచేసికోవాలంటే సుశిక్షణ, క్రమవిధానము అవసరం. క్రమశిక్షణతో బాటు నిర్భీతి, ధైర్యము స్వార్థరాహిత్యము, వీటిని అలవరచుకోవాలి. ఈఉత్కృష్టగుణముల నన్నింటిని వాలంటీరు ఉద్యమముద్వారా మనము సంపాదించుకోవాలి. ప్రతి దేశంలోనూ జాతీయనికాసాన్ని ముందుగా వాలంటీరు ఉద్యమమే చాటుతూవచ్చింది. ఇది ఇండియాపట్ల విరుద్ధముకాదు. ప్రస్తుతము

దేశంలో యువజనోద్యమము, వ్యాయామము అభివృద్ధి కావడము శుభ సూచకము. పైన పేర్కొనిన రెంటికిని వాలంటీరు ఉద్యమానికి ఒక సన్నిహితసంబంధము, పొత్తు వుండాలి. యువకులు సైనికశిక్షణవంటి క్రమశిక్షణ పొందాలి. కట్టుబాటులకు లోనైన మంచి తరిబియతుపొందిన వాలంటీర్లు కావాలి. అప్పుడే స్వాతంత్ర్యాన్ని సంపాదించగల క్రొత్తజాతిని సృష్టించగలిగినవారం ఔతాము."

౦౦౦

కలకత్తా కాంగ్రెస్ సమావేశం తరువాత బోసు, పండిత జవహరలాల్ నెహ్రూ, శ్రీనివాసయ్యంగార్లతోచేరి అఖిలభారత స్వాతంత్ర్యసమితిని స్థాపించాడు. దేశములో ప్రచండప్రచారము చేయడమే ఈసమితి ఉద్దేశము. ప్రతిరాష్ట్రానికి ఒక్కొక్క ప్రత్యేక కార్యక్రమం వంతున బోసు అతిచమత్కారంగా తయారుచేసాడు.

1927 మొదలు 1929 వరకు సుభాషచంద్రుడు వంగరాష్ట్రీయ కాంగ్రెస్‌కమిటీకి అధ్యక్షుడు; అఖిలభారత కాంగ్రెసుకమిటీకి సాధారణ కార్యదర్శి. నెహ్రూకమిటీఅని పేరుపడిన అఖిలపక్షసమావేశంలో బోసుకు సభ్యత్వం వుంది. 1929 లో ఆల్ ఇండియా ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ అధ్యక్షుడై 1931 వరకు ఆ మహాసంస్థ నాయకత్వాన్ని నిర్వహించాడు.

ఆరోజులలో బంగాళాశాసనసభలో స్వరాజ్యపార్టీవారి బలం యెక్కువగా ఉండేది. దానిని తగ్గించవలెననే ఉద్దేశంతోనో యేమో— 1929 ఏప్రియల్‌లో బంగాళాగవర్నరు ఎన్నికలు ప్రకటించారు. కాని జూన్ మాసంలోజరిగిన యెన్నికలలో స్వరాజ్యపార్టీవారు మరింత యెక్కువబలంతో శాసనసభ ప్రవేశించారు. అనేకమంది స్వరాజ్యపార్టీ సభ్యులు పోటీలేకుండానే గెల్చారు. ఇక మిగిలినవారు ఎంతోవ్యత్యాసంతో ప్రత్యర్థులను ఓడించివేసారు.



వాలంటీర్లు అంటే సుభాషచంద్రునికి ప్రాణం. అందువల్లనే హరిపుర కాంగ్రెస్ సందర్భంలో సుభాషచంద్రుడు వాలంటీర్ల వందనాన్ని స్వీకరించాడు



## హరిపురలో అధ్యక్షుని ఉత్సవము

కలకత్తాలో రాజకీయ నిర్బంధితుల దినోత్సవం. ఈసందర్భంలో 1929 ఆగస్టుమాసంలో దక్షిణ కలకత్తాలో బోసు బ్రహ్మాండమైన ఊరేగింపు లేవనెత్తాడు. ఈఉత్సవసందర్భములోనే పోలీసులు కిరణశంకర రాయ్ గారితోపాటు సుభాషచంద్రబోసునుకూడా 124 ఎ. సెక్షన్ క్రింద (రాజద్రోహం) ఎరెస్టుఅన్నారు. పంజాబులో సంచారంచేస్తూవుండిన బోసు ఎరెస్టుకోసం వారెంటు జారీఅయింది. సంచారం పూర్తిఅయినతరువాత సుభాషచంద్రుడు తిరిగివచ్చి ఆలిపూర్ మేజస్ట్రేట్ సముక్షమున హాజరయ్యాడు. విచారణముందు జామీన్ మీద విడుదల.

०°०

లాహోరు కుట్రకేసు నిర్బంధితుడు యతీంద్రనాథదాస్ లాహోరు సెంట్రల్ జైలులో సెప్టెంబరు 12–వ తారీఖున ప్రాణాన్ని విడచాడు. యతీంద్రదాసు రాజకీయనిర్బంధితులను–విచారణ జరిగేసమయాన్ని –రిమాండులో ఉన్నవారిని జైలుఅధికారులు సరిగా చూడవలెననే అభిప్రాయాన్ని లోకానికి, అధికారులతో పోరాటరూపాన్ని ధైర్యంగా

చాటాడు. ఈసందర్భంలో ఆ యువజనవీరుడు యతీంద్రుడు 63 దినాలు నిరశనవ్రతముసాగించి లాహోరు సెంట్రల్ జైలులోనే చనిపోయాడు. యతీంద్రునిశవము కలకత్తాకు తీసుకువచ్చారు. హౌరా, కలకత్తా వీధులలో సుభాషచంద్రుని నాయకత్వముక్రింద బ్రహ్మాండమైన ఊరేగింపు జరిగింది. ఊరేగింపు కొన్నిమైళ్ల పొడవుంది. దేశబంధుని మరణానంతరము ఇంతటి గొప్పఊరేగింపు కొన్నిలక్షలమంది సమావేశము జరిగియేవుండనేలేదు.

1929 సెప్టెంబరు 29 ని సుభాషచంద్రుడు హౌరారాజకీయ మహాసభకు అధ్యక్షత వహించాడు. అధ్యక్షోపన్యాసంలో వాలంటీరు ఉద్యమం యొక్క అవశ్యకత ప్రజాసమూహములలో ప్రచారము-వీటి అవసరముల గురించి విపులముగా చర్చించాడు.

ం౦ం

లాహోరులో 1929 అక్టోబరు 19 వ తారీఖునజరిగిన విద్యార్థి మహాసభకు సుభాషచంద్రుడు వెళ్లాడు. లాహోరులో అఖండమైన స్వాగతం జరిగింది. అధ్యక్షోపన్యాసంలో ఇలా చెప్పాడు:

"భావాలలో విప్లవము తీసికొనిరావాలంటే మన జీవితముచుట్టూ ఒక రక్షణవలె ఉండగల లక్ష్యాన్ని ఏర్పాటుపెట్టుకోవాలి. ఆ లక్ష్యమే స్వాతంత్ర్యం. కాని స్వాతంత్ర్యం అనేమాటకు అనేకమంది అనేక వింతవ్యాఖ్యానాలు చేస్తూ క్రొత్తక్రొత్తస్వరూపాలు యిస్తున్నారు. నా దృష్టిలో స్వాతంత్ర్యంఅంటే ఏదో వొక్కవిషయమును మార్చివేయడంకాదు. వ్యక్తికి స్వాతంత్ర్యంవుండాలి. సమాజానికి స్వాతంత్ర్యం వుండాలి. పురుషులకు స్వాతంత్ర్యం, అదేవిధంగా స్త్రీలకుస [illegible] ధనవంతులకు ధనహీనులకు స్వాతంత్ర్యం. అన్నితెగలవారికి [illegible] తంత్ర్యం అంటే ఒక్క రాజకీయముగ బానిసత్వము పో [illegible] సరిసమానముగ పంచడము, వర్ణవ్యత్యాసాన్ని [illegible] ఏర్పడిన

వివిధభాగాలను ఒక్కటిచేయడము-ఇది స్వాతంత్ర్యము. ఇది, కొందరికి ఆకాశహర్మ్యాలు నిర్మించడంగా కనిపిస్తుంది. కాని ఈలక్ష్యం వొక్కటే ఆత్మ యొక్క ఆవురుఆవురు మన ఆవేశాన్ని అంతరింపజేస్తుంది.

"స్వాతంత్ర్యం అంటే మన జాతీయజీవితంలో దానికి యెన్నో శాఖలున్నవి. మన జాతీయజీవితంలోని యేవొకటి రెండు అంశాలనో తీసికొని వాటిని పరిష్కరించడమే అని కొందరు తృప్తిపడతారు. ఈసంకుచిత దృక్పథమునుండి బయటపడడానికే మన కెంతో కాలం పట్టింది.

'మనం నిజంగా స్వాతంత్ర్యాన్ని ప్రేమించి, దాన్ని వాంఛిస్తూవున్నామంటే యేదో వొక స్వార్థాశయం కొరకు కామండా కేవలం స్వా... త్ర్యముకోసమే ప్ర... మంటే అందుకు... మైన అన్ని... ద...

...చిహ్నమైన పతకంతో ...భాషచంద్రుడు.

త్నించాలి. ఇది నా లక్ష్యము. ఇది నా వ్యాఖ్యానము. ఇటువంటి స్వాతం త్ర్యసంపాదనానికి ఇదే సరియైన సమయమని నావిశ్వాసము.

"ఇండియా తప్పకుండా స్వతంత్రదేశం ఔతుంది. ఆవిషయమై ఏమాత్రపు సందేహమూ లేదు. రాత్రిని అనుసరించి పగలు యెలావస్తుందో, ఇది యెంతయదార్థమో—స్థిరమైనసత్యమో, భారతదేశానికి స్వాతంత్ర్యం రావడంకూడా అంతటిదే. ఇంక ఇండియాను ఎక్కువకాలం దాసిత్వంలో వుంచగలశక్తి భూమండలముమీద లేనేలేదు. కాని యీసందర్భంలో మనం మనప్రాణములుకూడా అర్పించడానికి అర్హతగల భారతదేశంగురించి కలలు కంటూవుందాము. నేను స్వతంత్రభారతదేశం యెలాగు వుండాలని వాంఛిస్తు వున్నానో అది మీకు వివరించాను. స్వతంత్రంఅంటే ఏమని నేను అర్థం చెప్పు కుంటున్నానో దానిని మీకు విశదీకరించాను. అన్నివిధాలా, అన్ని శాఖ లలో, అన్నితరములలో ఉజ్వలపథాన్ని పట్టిన భారతదేశం ప్రపంచానికి స్వాతంత్ర్యం సందేశాన్ని అందజేసేలాగు ప్రయత్నించండి."

1929 నవంబరులో సుభాష్‌చంద్రుని కాలమంతా అలిపూరు కోర్టుకు హాజరౌతూ ఉండడంతోనే సరిపోయింది. 124 ఎ. సెక్షన్‌క్రింద ప్రభుత్వం తెచ్చినకేసే దీనికికారణం. డిసెంబరు 1-వ తారీఖున అమరావతిలో జరిగిన మధ్యపరగణాలు బీరారు విద్యార్థులమహాసభకు బోసు, అధ్యక్షత వహిం చాడు.

నవంబరుమాసంలో కాంగ్రెస్ కార్యసంఘసభ్యత్వానికి సుభాష చంద్రుడు రాజీనామా యిచ్చాడు. తనభావములు, కార్యసంఘభావములు కేవలం వ్యతిరేకమైయున్న కారణంచేత కార్యసంఘానికి నిరంతరము చికాకు కలుగుచుండుననే కారణంవల్ల ఈరాజీనామ యివ్వవలసివచ్చెనని అతడే వెల్లడిచేసాడు. అధినివేశస్వపరిపాలనము సక్రమశాస్త్రీయాభివృద్ధి మూల కముగా భారతదేశానికి చక్రవర్తిప్రభుత్వం ప్రసాదిస్తుందని ఆనాటి

వైస్రాయి లార్డు ఇర్విన్ చేసినప్రకటనమీద, గాంధిమహాత్ముడు, మరియితర నాయకులు వెలువరించిన నివేదిక అనంతరమే సుభాషచంద్రుడు యీరాజీ నామా యిచ్చాడు. గాంధిమహాత్ముడు, పండిత మోతీలాల్ నెహ్రూ, పండిత జవహర్‌లాల్ నెహ్రూ, పండిత మదనమోహనమాలవియా, డాక్టర్ అనిబిసెంట్, డాక్టర్ అన్సారి, సరోజినీదేవి, సర్. తేజ్ బహదూర్ సప్రూ, మరియితరనాయకులు వైస్రాయి సందేశముపైన చేసినప్రకటనమీద సుభాష చంద్రుడు, డాక్టర్ కిచ్లూ, వీరిద్దరు సంతకములుచేయ నిరాకరించారు. 'భార తీయుల అవసరాలకు ఉపకరించే అధినివేశ స్వపరిపాలనాచట్టాన్ని చక్ర వర్తి ప్రభుత్వం అమలు జరపదలచితే మేము సహాయపడెదము' అనే యీ నివేదికపైన-కలకత్తాకాంగ్రెస్ తీర్మానానుసారం సంతకం చేయడానికి వీలులేదని సుభాషచంద్రుడు నిర్మొగమాటంగా చెప్పాడు.

౧౦

లాహోరులోజరిగిన (1929 డిసెంబరు) 44 వ అఖిలభారత దేశీయ మహాజనసభాసమావేశంలో-స్వరాజ్యంఅంటే సంపూర్ణస్వాతంత్ర్యం అని, దీని సాధనవిధానముగ శాసనసభల బహిష్కారము అవసరమని తెలిపేతీర్మానాన్ని గాంధిమహాత్ముడు ప్రవేశపెట్టాడు.

దానికి ఈక్రింది సవరణతీర్మానాన్ని సుభాషచంద్రుడు ప్రవేశ పెట్టాడు:

"కలకత్తా కాంగ్రెసుతీర్మానంలో పేర్కొనబడిన స్వరాజ్యము అనే పదానికి అర్థము-యేవిధమైన బ్రిటిష్‌సంబంధమూలేని సంపూర్ణస్వాతం త్ర్యము.

"బ్రిటిష్ సామ్రాజ్యవాదము, దానికి ఇండియాలో సహాయముచేసే యితరశక్తులు వీటినిత్రోసివేసి సంపూర్ణస్వాతంత్ర్యమును సంపాదించడానికి విరివిగా సంపూర్ణస్వాతంత్ర్యప్రచారం చేయాలి. ప్రభుత్వంతో సరిసమా

వంగా మరియొక ప్రభుత్వమును (పేరలల్ గవర్నమెంటు) స్థాపించి ఆదేసమయాన్ని శాసనోల్లంఘనోద్యమము, పన్నులనిరాకరణము, అమలు బెట్టి ఎక్కడెక్కడ అవకాశమువున్నదో అక్కడక్కడ సాధారణమైన సమ్మెలు సాగించాలి.

"పై కార్యక్రమాన్ని ఆచరణలో పెట్టడానికిగాను భారతదేశీయులు యువజనోద్యమములను లేవనెత్తి కార్మికకర్షకులను, అణచబడినవారిని కట్టు దిట్టములక్రిందకి తీసికొనిరావలెనని ఈసభవారు కోరుతున్నారు.

"ఈ పై కార్యక్రమాన్ని ఒకధోరణిలో నడపడానికి కాంగ్రెసుక్రిడు భంగమురాకుండే విధానములలో నడపడానికి భారతీయులు కేంద్ర,రాష్ట్రీయ శాసనసభలను బహిష్కరించాలి. గవర్నమెంటు యేర్పాటుచేసిన విచారణసంఘాలు, స్థానికసంస్థలు, పోర్టుట్రస్టులు, న్యాయస్థానములు, వీటితో జోక్యము పెట్టుకోరాదు. ముందు జరుగబోయేయెన్నికలతో కాంగ్రెసువారు ఎటువంటి సంబంధము ఉంచుకోరాదు. ప్రస్తుతము స్థానికసంస్థలలో ఉన్న సభ్యత్వానికి రాజీనామా యివ్వాలి. వకీల్లు వృత్తిని మానివేయాలి.

"ఈపై కార్యక్రమాన్ని అమలులోపెట్టడానికికాంగ్రెసు కార్యసంఘానికి సంపూర్ణాధికారం ఇయ్యడమైనది. స్థలము, కాలము, అవసరములబట్టి



ప్రేగ్ నగరములో చికిత్స పొందుతూవున్న సుభాషచంద్రుడు

కార్యసంఘంవారు తమ యిష్టంవచ్చినట్లు కార్యక్రమాన్ని అమల పరచవచ్చు."

సుభాషచంద్రుడు ప్రవేశపెట్టిన ఈసవరణతీర్మానము ఓడిపోయినది. మహాత్మునితీర్మానము ఆమోదింపబడినది. లాహోర్‌నుండి తిరిగివచ్చినతరువాత సుభాషచంద్రుడు బంగాళారాష్ట్రీయ శాసనసభాసభ్యత్వానికి కలకత్తా కార్పొరేషన్ ఆల్డర్‌మన్‌పదవికి, కాంగ్రెసు నిర్ణయానుసారం రాజీనామా యిచ్చాడు.

1929 ఆగస్టు రాజకీయబాధితుల మహాసభాసంధర్భంలో చేసిన ఉపన్యాసంలో రాజద్రోహపునేరం ఉన్నదన్న ఆరోపణపైన 1930 జనవరి 23 వ బోసు తేదీన శిక్షితుడయ్యాడు. శిక్ష 9 మాసములు.

०ం०

సుభాషచంద్రుడు ఇంకా బందికానాలోనే వున్నాడు. ఆగస్టు 30 లో కలకత్తా కార్పొరేషన్ ఎన్నికలు జరిగాయి. సుభాషచంద్రుని మేయరుగా ఎన్నుకొన్నారు. 1930 సెప్టెంబరు 23 వ తేదీన అతడు విడుదల అయ్యాడు.

1931 జనవరిలో బోసు మూర్షిదాబాదు, నాడియా, ఉత్తరబంగాళములలో తీవ్రంగా సంచారం చేసాడు. మాల్దాజిల్లా సరిహద్దు చేరేసరికి, జిల్లాలో అడుగుపెట్టరాదంటూ మాల్దాజిల్లా మేజెస్ట్రేటు 144 జారీ చేసాడు. బోసు రైల్లోవుండగా పోలీస్ సూపరింటెండెంటు,యీనోటీసును అందించాడు. జిల్లాలో కాలు పెట్టవద్దన్నఆర్డరును బోసు నిరాకరించాడు. పోలీసు సూపరింటెండెంటు అమనూరాస్టేషన్‌లో అతన్ని దించివేసాడు. జిల్లా మాజెస్ట్రేటు, స్పెషల్ డివిజనల్ ఆఫీసరు, కొంత పోలీస్‌సిబ్బంది, అక్కడ హాజరు. ఆవిచారణ అతివిచిత్రమైనది. 1 వ తరగతి ప్రయాణికుల వెయిటింగ్‌రూమ్, కోర్టుగా మారిపోయింది. శిక్ష 7 రోజుల విడిఖైదు.

రాజషాహి సెంట్రల్ జైలు ఆవాసము. కోర్టుయెదుట చెప్పుకొనుట కేమైనా వుందాఅని అడిగితే, సుభాషచంద్రుడు యిలాచెప్పాడు:

"క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ 144 వ సెక్షన్ పూర్తిగా దుర్వినియోగంచేసారు. ఆత్మగౌరవముగల భారతీయుడనైన నేను ఈసెక్షనును శిరసావహించలేను. ఈసెక్షనును నే ననుసరించితే నా పౌరసత్వపువిధిని నిర్వహించనివాడ నౌతాను."

రాజషాహిజైలునుంచి బోస్‌ను ఆలిపూర్ సెంట్రల్ జైలుకు మార్చారు. ప్రజలలో ఆవేశము, ఉద్రేకము లేకుండా చేయడానికే యీ జైలుమార్పు. అర్ధరాత్రి 12 గంటలవేళ రాజషాహీ సెంట్రల్ జైలులో నిద్రపోతూవున్న బోసును లేపారు. అప్పటికే రైలు వెళ్లిపోయింది. ఆరాత్రివేళ అద్దెమోటారులు దొరకలేదు. 30 మైళ్ల దూరంలోఉన్న నాటోర్ రైల్వేస్టేషన్‌కి జిల్లామాజెస్ట్రేటే బోసును స్వయంగా తీసికొనివెళ్లాడు. ఇది అంతా జనవరి 18వ తేదీన జరిగింది. శిక్ష పూర్తియైనవెనుక సుభాషచంద్రుని వదలిపెట్టారు.

०°०

స్వాతంత్ర్యదినం. జనవరి 26 1931న కలకత్తాలో స్వాతంత్ర్యదినం. కలకత్తా కార్పొరేషన్ భవనపుఆవరణ కిటకిటలాడిపోతూవుంది. చుట్టుప్రక్కల వీధులన్నీ జనమయం. సుభాషబోసు మేయరుపదవి సంబంధమైన కార్యకలాపాన్నంతా పూర్తిచేసికొని కార్పొరేషన్ భవనమునుంచి బయటికివచ్చాడు. ప్రజాసమూహాలు సుభాషచంద్రునికి జేజేలు కొట్టినవి. వందలకొలది జాతీయపతాకాలు గాలిలో యెగురుతున్నవి. భారతమాతకు జయ్! మహాత్మగాంధికి జయ్! సుభాషబాబుకి జయ్! అనే జయజయధ్వనులు ఉత్సాహకంఠములనుండి వెలువడి మిన్ను ముట్టుతూవున్నవి. సుభాషచంద్రుడు ఆ స్వాతంత్ర్యమహోత్సవానికి నాయకత్వం వహించాడు.

బోస్ ముందు నడుస్తూవున్నాడు. మిగిలిన కాంగ్రెస్ నాయకులం అతనివెనుక. ఆవెనుక దేశసేవికలు. వారివెనుక సుశిక్షితులైన వాలంటీరుల బారులు. ఆవెనుక ప్రజాసమూహములు. అంతా కోలాహలము. కాని శాంతిభద్రతలకు భంగములేదు. ఉత్సాహం వున్నది గాని ఆత్రము, అగ త్యాయతనము లేదు. కొన్నివేలమంది వీరులై ముందునకు నడుస్తూవున్నారు.

ఉత్సవము కొంతదూరము సాగింది. ఇంతలో అశ్వదళముతో కలకత్తా పోలీస్‌కమీషనరు ఊరేగింపును అడ్డాడు. ఎదురుగా వరుసగా రౌతులచేత గోడ కట్టించాడు. ముందునకు అడుగువేయడానికి వీలులే దన్నాడు. రోడ్డుకు ఇరువైపులా వేలకొలదిగా గుమిగూడిన ప్రేక్షకులం ఇంక యేమౌతుందా, సుభాషబాబు యేమిచేస్తాడా అని ఆవేదన పడుతున్నారు.

సుభాషచంద్రుడు వీరుడు. గోడవలెవున్న గుర్రములు, రౌతులను చూచాడు. ముందుకు రెండుఅడుగులు వేసాడు. రెండు చేతులతో తనయెదుట వున్న రెండు గుర్రాలకళ్లెములు పట్టుకున్నాడు. బలముతో వాటిని పక్క లకు నెట్టివేసాడు. గుర్రాలగోడలో దారి చేసుకున్నాడు. అగ్నిశిఖలాగు ఆ స్వాతంత్ర్యయోధుడు ముందుకు వెళ్లాడు. అతనితో మరికొంతమంది ముందుకువచ్చారు. వెంటనే నాయకులపై, దేశసేవికులపై, వాలంటీర్లపై, ప్రేక్షకులపై లాటీప్రయోగము. సుభాషచంద్రునకు గాయాలు తగిలినవి. ఆమరునాడే ఎరెస్టు. ఆరుమాసముల కఠినశిక్ష.

o°o

సుభాషచంద్రుడు 1931 మార్చి 8వ తేదీన విడుదల అయాడు. ఈసమయానికే గాంధీ–ఇర్విన్ సమాధానం పూర్తిఅయింది. గాంధీ–ఇర్విన్ సంధిషరతులు సుభాషచంద్రునికి యెంతమాత్రమూ హితవుగా కన పించలేదు. ఈషరతులు అవాంఛనీయములంటూ తిరుగబడ్డాడు.


చికిత్సపొందుతూ మధ్యలో హటాత్తుగా ఇండియాకు వచ్చినపుడు తీసిన ఛాయాచిత్రము

గాంధీమహాత్ముని కలసికొని బంగాళా పరిస్థితులను గురించి మాట్లాడడానికి 1931 మార్చి 8-వ తేదీన సుభాషచంద్రుడు బొంబాయి వెళ్లి "బంగాళంలో యింకా 800 మంది రాజకీయబందీలు ఉన్నారు. దేశభక్తులయిన అంతమంది యువకులు బందికానాలలో మగ్గుతూ వుండగా గవర్నమెంటుతో సహకారం చేయడము గురించి యోచనచేయడానికికూడా యెలామనను వొప్పుతుందో నాకు బోధకావడములేదు అన్నాడు."

సుభాషచంద్రబోసు కలకత్తాకు తిరిగివచ్చాడు. మార్చి 20వ తారీఖున కరాచీ కాంగ్రెస్‌కు బయలుదేరాడు. కరాచీలో కేవలము కాంగ్రెస్‌కు హాజరుకావడమేకాకుండా అఖిలభారత నవజవాన్ మహాసభ, అఖిలభారత రాజకీయనిర్బంధితుల మహాసభ — వీటికి అధ్యక్షత వహించవలసివుంది.

కరాచీకాంగ్రెస్ సమావేశంలో సుభాషచంద్రుడు తీవ్రవాదుల పక్షము వహించి వారి భావములు లక్ష్యము వీటినిగురించి వివరముగా తెలియజేశాడు. గాంధీ-ఇర్విన్ సమాధానము చాలా నిరుత్సాహకరంగా అసంతృప్తికరంగావుంది. రాజకీయవాదులు చీలిపోవడానికికూడా అంగీకరించి "ప్రభుత్వం యేర్పాటుచేసిన బోను"లోనికి, అందులోను భగత్ సింగును ఉరితీసినసమయమున వెళ్లడము అవాంఛనీయమని సుభాషచంద్రుడు తెలియజేశాడు.

౧౦

రాజకీయనిర్బంధితులకుగాను ప్రత్యేకంగా యేర్పాటైన హిజ్లీ బందికానాలో కాల్పులు జరిగాయి. ఇద్దరు రాజకీయనిర్బంధితులు చనిపోయారు. అనేక దురంతములు జరిగినవన్న కబురు వినినంతనే 1931 సెప్టెంబరు 17వ తేదీన సుభాషచంద్రుడు బంగాళా రాష్ట్రీయ కాంగ్రెస్ అధ్యక్షస్థానానికి, కలకత్తా కార్పొరేషన్ ఆల్డర్మన్ పదవికి రాజీనామా యిచ్చాడు. 1931 అక్టోబరుమాసములో సుభాషచంద్రునిమీద రెండు మారులు 144 శెక్షన్ ప్రయోగించారు. (మొదటిమారు బారక్పూర్ కార్మికమహాసభ సందర్భంలో; రెండవది ఢాకాకు ప్రయాణం కట్టి వెళ్తూవుంటే మధ్యలో తేజగోన్ రైలుస్టేషనువద్ద) ఢాకాకు-ఉద్యోగేతర విచారణసంఘములో సభ్యుడుగా వెళ్తూవుండగా 144 ప్రయోగించడము బోసుకు ఆగ్రహం కలిగించింది. ఈ రెండుమారులూ పోలీసులు సుభాషచంద్రుణ్ణి ఎరెస్టుచేశారు. కాని ఆతరువాత ప్రాసిక్యూషన్ చార్జిలను ప్రభుత్వమే ఉపసంహరించుచున్నది. మొదటిమారు ఎరెస్టుచేయబడిన సందర్భంలో "బోసుగారిని నిలిపివేశాముకాని ఎరెస్టుచేయలేదు" అంటూ ప్రభుత్వము ప్రకటించింది.



హరిపురలో అధ్యక్షోపన్యాసం యిస్తూవున్న సుభాషచంద్రుడు

హిజ్లీబందికానాలో కాల్పులు, అప్పుడు యిద్దరు రాజకీయబందీలు చనిపోవడము, చిట్టగాంగులో హద్దుమీరిన పోలీసు దౌర్జన్యము, సి.ఐ.డి. అసనుల్లాగారి హత్య–వీటన్నింటి ఆధారమున బంగాళములో తీవ్రమైన అల

జడి ప్రారంభం అయింది. దానికితోడు క్లిష్టపరిస్థితులు యేర్పడినవి. వంగరాష్ట్రి విషయములో కాంగ్రెస్ కార్యసంఘము యెటువంటి జోక్యమూ కలుగ జేసికొనకుండ నిర్లక్ష్యము గావుండడము తగదుఅంటూ సుభాషచంద్రుడు ఘాటైన నివేదిక ప్రకటించాడు. ప్రజలహక్కులను యీవిధంగా గమనించ కుండా దురంతములు జరుగుతూవున్న సమయములో కాంగ్రెస్ వెంటనే "సివిల్ రైట్స్ కమిటీ"ని యేర్పాటుచేయడము అవసరంఅంటూ సుభాష చంద్రుడు సూచించాడు.

oOo

డిశెంబరు 29 (1931)ని బొంబాయిలో జరిగే కాంగ్రెస్ కార్య సంఘ సమావేశానికిరావలసింది అంటూ కాంగ్రెస్ అధ్యక్షులు సర్దార్ వల్లభభాయి పటేలుగారు సుభాషచంద్రునకు ఉత్తరం వ్రాశారు. అప్పటికి గాంధీమహాత్ముడు లండనునుంచి తిరిగివచ్చాడు. ఆ సందర్భములోనే యీ కార్యసంఘసమావేశము యేర్పాటయినది.

1932 జనవరి 2వ తేదీన సుభాషచంద్రుని కల్యాన్ రైలుస్టేషనులో బొంబాయి పోలీసులు 1818 రెగ్యులేషన్ III చట్టముక్రింద ఎరెస్టుచేశారు.

oOo

కల్యాన్ స్టేషనులో ఎరెస్టయినతరువాత బోసును సోనీసబ్ జైలులో కొంతకాలంవుంచారు. సోనీసబ్ జైలునుంచి జబ్బల్పూర్ సెంట్రల్ జైలుకు మార్చారు. అక్కడనుంచి భవాలీ శానిటోరియానికి కొంతకాలం తీసికొనివెళ్లారు.

ఇన్ని బందికానాలలోమార్చిన సుభాషచంద్రుని, ఆరోగ్యం ధ్వంసం అయిపోయింది. అందువల్ల వైద్యపరీక్షకోసం బోసును లక్నో బలరామ పూర్ వైద్యాలయానికి తీసికొనివెళ్లారు. ఆ అనారోగ్యస్థితిలోవున్న




యూరపువెళ్లే సందర్భంలో "స్వాతంత్ర్యపతాక శాశ్వతంగా యెగురుతూ వుండేలా చూడండి" అంటూ సుభాషచంద్రుడు సందేశం యిచ్చాడు.

సుభాషచంద్రుని—విదేశాలలో చికిత్సపొందడానికిగాను ప్రభుత్వము చివరకు విడుదల చేసింది.

సుభాషచంద్రుని విదేశయాత్రకు అవసరమైన ధనాన్ని ఆతని బంధువర్గం సమకూర్చింది. 1933 ఫిబ్రవరి 23 వ తేదీన సుభాషచంద్రుడు బొంబాయిలో స్టీమరుయెక్కాడు. బోసు యెక్కినస్టీమరు భారతతీరములు వదలేఅంతవరకు రెగ్యులేషన్ ఆర్డరునువుంచి, కదలినతరువాతనే రద్దుపరచారు. స్టీమరు కదులుతూవున్నసమయాన్ని సుభాషచంద్రుని హృద

యాన్ని దేశానికి వ్యాఖ్యానంచేసి చెప్పగల "బంగాళము ధ్వంసమైతే జీవించేదెవ్వరు? బంగాళము బ్రతికివుండగా చనిపోయేదెవ్వరు?" సందేశాన్ని అందజేశాడు.

౧౦

సుభాషచంద్రుడు 1933 మార్చి 8-వ తేదీన చికిత్సకోసము వియన్నా చేరాడు. వియన్నా ఫెర్తుశానిటోరియంలో దిగాడు. చికిత్సకోసమే వియన్నాకు వెళ్లిన విఠల్ భాయి పటేలును, బోసు అక్కడనే కలిసికొన్నాడు. వీరు యిరువురు కలిసికొన్నతరువాత వీరవిఠల్ భాయ్ పటేలు యెక్కువకాలము బ్రతుకలేదు. అంతకుముందు 1933 మే 9-వ తేదీన శాసనోల్లంఘనోద్యమాన్ని నిలుపుదల చేసినందుకు గాంధీమహాత్ముని తీవ్రంగా విమర్శిస్తూ ఒకనివేదికను విఠల్ భాయిపటేలు, బోసు యిద్దరూ ప్రకటించారు. అప్పటికి సుభాషచంద్రుని ఆరోగ్యముకూడా చక్కబడకపోయినా ప్రమాదస్థితిలోవున్న వీరవిఠల్ శయనమందిరాన్ని విడువకుండా సుభాషచంద్రుడు దివారాత్రములు సేవచేస్తూవచ్చాడు. బోసు యెంతసేవచేసినా వీరవిఠల్ ప్రాణములు నిలువలేదు. తరువాత వీరవిఠల్ భాయి మృతకళేబరాన్ని ఇండియాకు పంపించాడు.

ధ్వంసమైపోయిన ఆరోగ్యాన్ని సాధ్యమైనంతవరకు చక్కజేసికొనడానికి సుభాషచంద్రబోసు, విఠల్ మరణానంతరము 1933 మార్చి మొదలు 1936 వరకు యూరపులోనే నివసించాడు. ఈ మూడుయేండ్లలోనూ సుభాషచంద్రుడు కేవలము ప్రవాసశిక్ష అనుభవిస్తూవున్న వానిలానే జీవిస్తూవచ్చాడు. బోసు ఇంగ్లండు, రష్యా, అమెరికా సంయుక్తరాష్ట్రము వెళ్లరాదన్న నిషేధంవుంది. లండనులో 'లండన్ ఇండియన్ రిపబ్లికన్ అసోసియేషన్'వారు యేర్పాటుచేసినసమావేశానికి బోసు అధ్యక్షత వహింపవలసివుండెను. కాని అందుకు అవసరమైన సౌకర్యములను సమకూర్చ

డానికి ప్రభుత్వంవారు నిరాకరించారు. అందువల్ల సుభాషచంద్రుడు వ్రాసిన అధ్యక్షోపన్యాసంమాత్రం ఆ సమావేశములో చదివారు. బోసు అధ్యక్షోపన్యాసం ఇండియాకు రాకూడదంటూ సీకస్టమ్సు ఆక్టుక్రింద నిషేధించారు. సుభాషచంద్రుడువ్రాసిన "భారత స్వాతంత్ర్యసమరము" అనే గ్రంథం లండనులో ప్రచురితమయింది. అనేకమంది రాజకీయవేత్తలు యీ గ్రంథాన్ని యెంతగానో కొనియాడారు. ఐతేనేమి, యీపుస్తకంకూడా ఇండియాకు రాకూడదు.

1934 డిశెంబరు 4_వ తేదీన సుభాషచంద్రుడు ఒకమారు స్వదేశానికి వచ్చాడు. ఆరావడము యేదో కొద్దిరోజులు వుండడానికిమాత్రమే. తండ్రి జానకీనాథబోసుగారు ప్రమాదావస్థలో వున్నారని తెలిసి డచ్ యేర్ మెయిల్ విమానములో ఇండియాకు వచ్చాడు.

సుభాషచంద్రుడు కరాచీవచ్చి వ్రాలాడు. అప్పటికే తండ్రి చనిపోయాడన్నదుఃఖవార్త తెలిసింది. అతడలా దుఃఖములో మునిగివుండగానే ఒక కస్టమ్సుఉద్యోగి, యింకొక సి. ఐ. డి. ఉద్యోగివచ్చి సుభాషచంద్రుని సామానులను శోధనచేశారు. "భారత స్వాతంత్ర్య సమరము" తాలూకు టైపుప్రతి సుభాషచంద్రునిపెట్టెలో వుండగా దానిని సి. ఐ. డీ. స్వాధీనం చేసికొన్నాడు.

సుభాషచంద్రుడు ఏరోప్లేనులోనే ప్రయాణంచేశాడు. డండం విమానాశ్రయంలో బోసు కాలుపెట్టేసరికి బెంగాలు క్రిమినల్ లా అమెండ్ మెంటు చట్టము ప్రత్యక్షం. విమానాశ్రయమునుంచి యకాయకి ఎల్జిన్ రోడ్డులోని గృహానికేవెళ్లి నిర్బంధంలోవున్నట్లుగానే ఆయింట వుండాలిగాని యిక్కడకూ అక్కడకూ వెళ్లరాదంటూ నిర్బంధించారు. అంతేగాక కలకత్తాలో కాలుపెట్టిన యేడురోజులోనే మళ్లీ యిక్కడనుండి వెళ్లిపోవా-

లంటూకూడా నోటీసు యిచ్చారు బంగాళా ప్రభుత్వంవారు. కడకు శ్రాద్ధ కర్మలు పూర్తిఅయేవరకు కలకత్తాలోవుండడానికి అవకాశం యేర్పడింది.

తండ్రి శ్రాద్ధకర్మలు పూర్తిఅయనవి. సుభాషచంద్రుడు 1935 జనవరి 8వ తేదీన యూరపునకు ప్రయాణంఅయాడు. యూరపు చేరినతరువాత యూరపులో ప్రసిద్ధవైద్యశిఖామణి డాక్టర్ డామిౙ్ సుభాషునకు శస్త్రచికిత్సచేశాడు. శస్త్రచికిత్స సక్రమంగా జరిగింది. బోసుకు ఆరోగ్యం చక్కబడుతూవచ్చింది.

సుభాషచంద్రుడు "భారతజాతీయ స్వాతంత్ర్యసమర చరిత్ర" అనే ఉద్గ్రంథాన్ని వ్రాయడానికి వొప్పుకున్నాడు. పుస్తకము చాలవరకు పూర్తి అయింది. కాని గ్రంథంకోసం దివారాత్రములు శ్రమపడడమువల్ల మళ్లీ బోసు ఆరోగ్యము చెడిపోయింది. అతడు మంచముపట్టాడు. పుస్తకము పూర్తిచేయలేకపోయాడు. జనవరి 6వ తేదీన వియన్నాలో జరిగిన యూరపులోని భారతీయుల సమావేశానికి బోసు హాజరుఅయాడు. రోము నగరములో డిశంబరుమాసంలో జరిగిన ఆశియావిద్యార్థుల మహాసభకు వెళ్లాడు. ఆ తృతీయసమావేశానికి బోసు అధ్యక్షత వహించాడు.

1936 ఫిబ్రవరిలో సుభాషచంద్రుడు ఐర్లండు వెళ్లాడు.

०ᵒ०

సుభాషచంద్రుడు మార్చి 15వ తేదికి ఇండియాకువచ్చి లక్నోలో జరిగే జాతీయమహాసభా సమావేశానికి హాజరు కావాలనుకొన్నాడు. ఈ విషయము పత్రికలలో ప్రకటితమయింది. తనకు యీఅవకాశం తప్పకుండా లభ్యం ఔతుందని అతని అభిప్రాయం. కాని యింతలోనే వియన్నాలోని బ్రిటిష్ కాన్సలువద్దనుంచి ఉత్తరం వచ్చింది. బోసు ఇండియాకు రాదలచిన

వార్త ఇండియా గవర్నమెంటుకు తెలిసిందనీ, అలాతిరిగివస్తే యిప్పుడు అనుభవిస్తూవున్న స్వాతంత్ర్యంవుండదనీ ఇండియాగవర్నమెంటు తనకు తెలియజేసినట్లుగా బ్రిటిషుకాన్సలు వ్రాశాడు. ఈ ఉత్తరము చూచి సుభాషచంద్రుడు తనఅభిప్రాయాన్ని మార్చుకోలేదు. గవర్నమెంటు అభిప్రాయంపట్ల తనకుగల తీవ్రవ్యతిరేకభావాన్ని వెల్లడిచేస్తూ విదేశాలలో ప్రవాసిగావుండడముకన్న స్వదేశంలో బందీగావుండడమే వెయ్యిరెట్లు యెంతోమంచిదనీ తనకు ప్రియతమమనీ ప్రకటించాడు.

1936 ఏప్రెల్ 8వ తేదీన సుభాషచంద్రబోసు బొంబాయిలో దిగాడు. పోలీసులు వెంటనే అతన్ని ఎరెస్టుచేసి ఆర్థర్‌రోడ్ బందికానాకు తీసికొనివెళ్లారు. ఆతరువాత అక్కడనుండి యరవాడా బందికానాకు మార్చారు. అక్కడనుంచి మళ్లీ జబ్బల్పూరు సెంట్రల్‌హాస్పిటలుకు మార్చారు. ఇన్నిమార్పులూ అయినతరువాత బంగాళంలోని కుర్సియాంగ్‌కు మార్చివేశారు.

సుభాషచంద్రుడు భారతదేశంలో కాలు పెట్టీపెట్టడముతోనే యెరెస్టుచేయడము బందికానానుంచి బందికానాకు మారుస్తూరావడము దేశీయులకు యెంతమాత్రమూ హితవుగా కనబడలేదు. ఈచర్యపట్ల దేశమంతా వొక్కమారుగా నిరసనభావాన్ని ప్రకటించింది. "ఇది భారతదేశంలో పౌరస్వత్వపు హక్కులను పూర్తిగా అణచివేయడమంటే యిదే అని బోసు యెరెస్టు స్పష్టీకరిస్తూవుంది. ఇది దారుణము" అంటూ ఆనాటికి కాంగ్రెస్ అధ్యక్షుడు పండిత జవహరలాలు నెహ్రూ ప్రకటించాడు.

మే పదవ తేదీ సుభాషచంద్రబోసు దినముగా ప్రకటితమయింది. ఆరోజున భారతదేశములో అన్నిప్రదేశములలోనూ సభలు జరిగాయి. సుభాషచంద్రుని ఎరెస్టుపట్ల భారతీయులందరూ తీవ్రమైన అసమ్మతిని ప్రకటించారు.

1936 డిశెంబరులో వైద్యపరీక్షకోసము సుభాషచంద్రుని కుర్సి యాంగ్ నుండి కలకత్తా మెడికల్ కాలేజీహాస్పిటలుకు మార్చారు. అంత ముందువరకు అతనికి చేకూరిన ఆ ఆరోగ్యంకాస్తా యీ బందికానాజీవనము, యీమార్పులు వీటివల్ల మళ్లీ యెటువంటి మార్పులేకుండా అలానే ఆగింది.

1937 మార్చి 17వ తేదీన గవర్నరుజనరలు సు భా ష చం ద్రు ని విడుదలచేశాడు.

సుభాషచంద్రుని విడుదలవార్త వినిన భారతీయులంతా సంతోషించారు. విడుదలయైనతరువాత బోసు కలకత్తాలోనే ఒకమాసముదినములుండి సర్ నీలరతన్‌సర్కారువద్ద చికిత్సపొందాడు. 1937 ఏప్రెల్ 7వ తేదీన కలకత్తా శ్రద్ధానందపార్కులో సుభాషచంద్రునకు జాతీయ సన్మానము జరిగింది.

ఏప్రెల్ 25వ తేదీన వైద్యసలహామీద ఆరోగ్యముకోసము సుభాషచంద్రుడు పంజాబులోని డల్హౌసీకి వెళ్లాడు. అక్కడ డాక్టర్ ధర్మవీర్ దంపతులకు అతిథిగావున్నాడు.

అక్టోబరు 7వ తేదీన సుభాష్‌చంద్రుడు డల్హౌసీనుంచి కలకత్తాకు తిరిగివచ్చాడు. కలకత్తానుంచి తిన్నగా కుర్సియాంగ్ వెళ్లాడు. అక్కడ కొంతకాలంవుండి అక్టోబరు 24వ తేదీన కలకత్తాకువచ్చి ఆల్ ఇండియా కాంగ్రెస్ కమిటీ సమావేశసందర్భంలో జరుగవలసిన యేర్పాటులన్నీ చేయించాడు.

నవంబరు 28వ తేదీన ఆరోగ్యంకోసముని తిరిగి యూరపు వెళ్లాడు. ఈమారు ఆస్ట్రియాలోని "బాడ్ గస్టిన్"లో ఆరువారములపాటు వుండి చికిత్సపొందాడు. 1938 జనవరి 8వ తేదీన ఆస్ట్రియానుంచి ఇంగ్లండు

# తీవ్రతర రాజకీయాలు

ప్రపంచ సంచలనము
ప్రచలిత భారతహృదయము
తెలిసికోనాలంటే

# ప్ర జా బం ధు

చ ద వ క త ప్ప దు.

ప్రజాబంధు వారపత్రిక ప్రత్యేకవ్యాసాలకు ఘాటైన విమర్శలకు, కబుర్లపోగు మొదలైన ప్రత్యేకశీర్షికలకు పేరుపడింది.

మీరు యితరపత్రికలు యెన్నియైనా చదివివుండవచ్చు—
కాని ప్రజాబంధు చదవడంమాత్రం తప్పదు.
ప్రజాబంధుకు ప్రత్యేకత వుంది.

కావలిస్తే యివ్వాళే మాదిరిపత్రికకు వ్రాయండి.
ఉచితంగా వస్తుంది.

ప్ర జా బం ధు

ఆండర్‌సన్ వీధి :: మద్రాస్

ప్రయాణమయాడు. ఇంగ్లండులో సుభాషచంద్రునికి అఖండస్వాగతం జరిగింది. లండనులో భారతీయసమస్యగురించి పార్లమెంటు సభ్యులు అనేకమందితో బోసు చర్చించాడు.

అఖిలభారతదేశీయమహాసభ సాధారణకార్యదర్శి 1938 జనవరి 18వ తేదీన హరిపురలో జరిగే 51వ కాంగ్రెస్ సమావేశానికి అధ్యక్షుడు సుభాషచంద్రుడని ప్రకటించాడు.

ఎంతో చక్కబడినఆరోగ్యముతో సుభాషచంద్రుడు జనవరి 24వ తేదీన కలకత్తాకు తిరిగివచ్చాడు. ఆతరువాత కాంగ్రెస్ విజయసారథ్యాన్ని స్వీకరించాడు.





PRINTED BY LODHRA PRESS, ROYAPETTAH, MADRAS.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA129B156 |
| పుస్తకం పేరు | రాష్ట్రపతి సుభాషచంద్రుడు |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 51 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 3 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Sowmya |
| పేజీలు విడదీసినది | Sowmya |
| స్కాన్ చేసినది | Srilakshmi |
| పరీక్ష చేసినది | SANDHYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |